## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), అర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) అర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035897

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Author's Last Name

| A | B | C | D | E | F | G | H | I | J | K | L | M | N | O | P | Q | R | S | T | U | V | W | X | Y | Z |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సుశిక్షణ

(పిల్లల నీతికథలు)

రచన :

జయశ్రీ మల్లిక్

నవదుర్గా పబ్లికేషన్స్

రామాలయం — 522 501

గుంటూరు జిల్లా

# సుశిక్షణ

పరంధామయ్యగారు విజయవాడ పట్టణంలో స్థిరపడి పోయ్యారు. ఆయనకు ఓ నాలుగు ఎకరాలు మాగాణీ, దానికి తోడుగా ఒక డాబా, ఇల్లూ, కొంతస్థలమూ వుంది. మొత్తం మీద జీవనానికి ఏ లోటూ లేదనేచెప్పాలి. ఆయన ఇల్లు వూరికి చివరగావుంది. చల్లనిగాలన్నా, చక్కని వాతా వరణమన్నా, ఆయనకు చాలాఇష్టం.

ఆరోగ్యం విషయంలో ఆయన చాలా శ్రద్ధచూపిస్తూ వుంటాడు. ఆరోగ్యమేకదా మహాభాగ్యం? మనిషి ఆరో గ్యంగావుంటే సంపాదన ఏదోనాటికి అదే సమకూరుతుంది. ఆరోగ్యం పాడయితే జీవితం పతనం అవుతుంది. ఆయనకు ఇద్దరు మొగపిల్లలు. పెద్దవాడు గోపి, రెండవవాడు సురేష్. ఇద్దరూ హైస్కూలు విద్యాభ్యాసం సాగిస్తున్నారు. పిల్ల లను గారాబం చేయటం, అయినదానికీ కానిదానికీ వారిని వెనకవేసుకువచ్చి సమర్థించడంలాంటివి పరంధామయ్య గారికి బొత్తిగా గిట్టని విషయాలు! పిల్లల భవిష్యత్తుకై

పురాణాలు వేయగలిగింది తల్లిదండ్రులేనని ఆయన నమ్మకం.

పాఠశాలనుంచి రాగానే స్నాన సంధ్యలు పూర్తి చేసుకుని పుస్తకాలు ముందు వేసుకుని చదువు మొదలు పెట్టకపోతే! కుమారులకు ఒక రోజంతా భోజనం లేకుండా చేసేవాడాయన. తల్లి లక్ష్మమ్మగారికి తన భర్తవిషయం బాగా తెలుసు. అందుకే ఆమె లోలోపల బాధపడుతున్నా భర్తమాట అనుసరించక తప్పేదికాదామెకు. ఈ నిబంధనల వల్ల పిల్లలు శ్రద్ధాభక్తులతో పెరగసాగారు.

గోపీ, సురేషిద్దరూ, స్నేహితులతో కలిసి తిరిగే వారుకారు. ఏ, ఒకరిద్దరో వున్నా, వారుకూడా చాలా బుద్ధిమంతులై వుండేవారు. నెలకొక్క సినిమా! అదికూడా తాను చూసి పిల్లలకు ఏదయినా,ఉపకరించగలదనుకుంటేనే వారిని పంపేవాడాయన. వారికి మంచి విషయాలు తెలుసుకోవటం కోసం అప్పుడప్పుడూ, చరిత్ర ప్రసిద్ధమైన ప్రదేశాలూ, నదులు, మ్యూజియమ్‌లూ, చూపించి వాటి వివరాలూ, ఉపయోగాలూ తెలియచెపుతూ, వారి బుద్ధివికాసానికి తోడ్పడుతూ వుండేవాడు. ఒకనాటి సాయంకాలం పిల్లలిద్దరినీ తీసుకుని కృష్ణానదికేసి షికారు బయలుదేరారాయన.

కృష్ణానదీ తీరంవెంట నడుస్తూ, ప్రకాశం బ్యారేజిని గురించి పిల్లలకు వివరిస్తున్నారాయన.

"ఏరా? గోపీ? ఈ బ్యారేజిని ఏ పేరుతో పిలుస్తారు?"

"ప్రకాశం బ్యారేజి నాన్నగారూ!" గోపి తడుము కోకుండా తండ్రి ప్రశ్నకు సమాధానం చెప్పాడు.

"వినండి! ఈ బ్యారేజి మూలంగా ఏటా కొన్ని లక్షల ఎకరాలు సాగుబడికి కావలసిన నీరు అందుతుంది; కృష్ణాజిల్లా అంతటికీ కావలసిన నీటి వనరు దీనిమూలంగా, పొందగలుగుతూ, ఓ ప్రక్కన భూమిని సస్యశ్యామలంగా మార్చడమే కాకుండా మరోవైపు ప్రయాణ సౌకర్యాలకై సహాయ పడుతోంది!"

"ప్రయాణ సౌకర్యాల కేమిటి నాన్నగారూ?" సురేష్ అమాయకంగా ప్రశ్నించాడు.

"చూడు సురేష్! నువ్వు పడవలూ, లాంచీలూ ఇలాంటివి నీటిలో ప్రయాణంచేయడం చూడలేదూ! కొన్ని కొన్ని ప్రాంతాలకు బస్సూ, రైలూ మొదలయిన సౌకర్యాలు వుండవు. అలాంటి ప్రాంతాలకు ఈ సాధనాలు ప్రజలకు నీటిద్వారా బాగా వుపకరిస్తున్నాయ్. ఈ నదులన్నీ కలసి సముద్రంగా మారాయి. ఆ సముద్రం గుండా ఇతర దేశాలతో మనకు, మననుంచి యితర దేశాలకూ ఎన్నో విధాలయిన వ్యాపార సంబంధాలు జరుగుతున్నయ్! అలాగే నాగార్జునసాగర్ ఆనకట్టు. ఆంధ్రప్రదేశ్ లోగల ప్రాజెక్టులలో అతి ముఖ్యమయినదీ, పెద్దదీ నాగార్జునసాగర్ డామ్! ఈ ఆనకట్ట కూడా కృష్ణానదిపైన నిర్మించిందే! దీని

మూలంగా సాలుకు 21.50 లక్షల ఎకరాల్లో పంటలు పండించే వీలుంటుంది. దీనికి కుడిభాగాన 135 మైళ్ళుగల కాలువ, ఎడమవైపున 108 మైళ్ళుగల కాలువ లుంటాయ్. ఈ ప్రాజెక్టువద్ద 110 చదరపు మైళ్ళ విస్తీర్ణం కలిగిన ఓ సరస్సు యేర్పాటు చేస్తున్నారు. ప్రపంచంలోగల పెద్ద సరస్సులలో అది ఒకటన్నమాట. ఈ సరస్సులో 9 37 మిలియన్ల ఎకరాల అడుగుల నీరు నిల్వగావుంచి పంటలకు ఉపయోగిస్తారన్నమాట. ప్రతిదీ చూస్తూ పోవటంకాదు అబ్బాయిలూ! కన్నులు చూసిన దానిని— దానివలన మానవునికి కలిగే ఉపయోగాలనూ, మేధస్సు ద్వారా ఆలోచించి తెలుసుకో గలగాలి. అదీకాకుండా ముఖ్యమైన పరిశ్రమ మత్స్య పరిశ్రమ. ఈ నీటి మూలంగానే గదా జరిగేది. పదండి. కాసేపు బ్యారేజిపై కూర్చుని చల్లగాలి పీల్చుకుందాం" అంటూ కుమారుల చేతులు పట్టుకుని బ్యారేజి వైపు నడిచారాయన.

"నాన్నగారూ! మిగిలిన ఆనకట్టల విషయం చెప్పరేం?" గోపీ కుతూహలంగా ప్రశ్నించాడు.

"ఆనకట్టలు ఎక్కడున్నా, ఎన్నివున్నా వాటి ఉపయోగం ఒకటే. ఏమిటంటే. మనిషి ప్రగతికి పనికి రాకుండా, నదీజలాలు వృధాగా సముద్రంలో కలిసిపోతుండేవి. ఇప్పుడీ ఆనకట్టలు నిర్మించి, వీటిని వ్యవసాయానికి అవసరమైనప్పుడల్లా రైతులకు అందించడమే వాటి ధ్యేయం. అలా చేయకుండటంవలన నీటిఎద్దడి లేక ఏ ప్రాంత

మయిన ఏ పంటయినా, సకాలంలో నీరందడంవలన సక్రమ
మైన ఫలితాలను రైతుకు అందజేయగలవు కదా! ఇప్పుడు
మనం, కృష్ణా బ్యారేజీని గురించీ, నాగార్జునసాగర్ డామ్
గురించీ మాట్లాడుకున్నాం. ఇవికాక, సోమశిల ప్రాజెక్టు తుంగ
భద్రడామ్, పోచంపాడు ప్రాజెక్టు, వంశధారడామ్, కిన్నెరసాని
ప్రాజెక్టు, ధవళేశ్వరంవద్ద, గోదావరి ఆనకట్ట, బహుధా
రిజర్వాయరు. ఇంకా అనేకమైన ప్రాజెక్టులు నిర్మాణంలో
వున్నాయ్. వీటి ఉపయోగాలు మీకింతకుముందు వివ
రించానుగదా!" పరంధామయ్యగారు కుమారులకు ఇంకా
చెప్పవలసిన విషయాలగురించి ఆలోచిస్తూ, కృష్ణానదిలో
ప్రవహిస్తున్న స్వచ్ఛమైన నీటిలోకి చూస్తున్నారు వంతెనపై
నుంచి.

గోపీ, సురేష్‌లు వంతెనపై అటూ, ఇటూ, తిరుగు
తున్న వాహనాలనూ, మనుష్యులనూ చూస్తున్నారు. నిజంగా
ఇలాంటి వంతెనలు లేకపోతే, ఇంత పెద్ద నదులపైనుంచి
ప్రయాణం మనిషికి ఎంతకష్టం? ఎంతఆలశ్యం! అనుకుంటూ
ఆలోచిస్తున్నారు వాళ్ళిద్దరూ!

"మరి నాన్నగారూ! నీటిని దుర్వినియోగం చేయ
కుండా, భారతదేశం సశ్యస్యామలం కావాలని, ఇన్నిన్ని
కోట్లు వెచ్చించి, ఈ ఆనకట్టలూ, కాలువలూ ఏర్పాటు
చేస్తున్నారు. మరి వరదలవల్ల అధికమైన నీరువచ్చి ఇంత
కష్టపడి రైతులు పండించిన పంటలు, చేతికి అందకుండా
చేస్తున్నాయ్ గదా!" గోపీ ప్రశ్నించాడు. పరంధామయ్యగారు
సమాధానంగా ముసిముసిగా నవ్వారు. ఫరవాలేదు కొడు

కులు అట్లా స్వయంగా ఆలోచించే శక్తికి ఎదగాలనే ఆయన అభిప్రాయం.

“ఇవన్నీ ఆలోచించే, ప్రభుత్వం వరద నివారణోపాయాలు కనిపెట్టింది. ముఖ్యంగా వరదలకు ఎక్కువగా గురి అవుతున్న కోస్తా, ఆంధ్రాప్రాంతాలన్నీ అధికారులు, పర్యటించి, ఈ వరదలకు మూలకారణమయిన ఏరులూ, మొదలయిన వాటిని పరిశీలించి, తమ్మిలేరు, ఎర్రకాల్వ రామిలేరు, బుడమేరు మొదలయిన వాటికి సరస్సులు త్రవ్వించి ఆనీటిని వాటిలో నిలువచేయడానికి నిర్ణయించడం జరిగింది. మిగిలిన మురుగునీరంతా, ఉప్పుటేరు గుండా సముద్రంలోకి పంపే ఏర్పాట్లుచేశారు. తెలిసిందా అంటూ పిల్లలవైపు చూశారు.

ఇంతలో, నిండా బరువునింపుకున్న లారీ ఒకసైకిలుకు ఢీ కొట్టడం జరిగింది సైకిలుపై ప్రయాణించే యువకునికి బాగా దెబ్బలు తగిలాయి. అతను అపస్మారక స్థితిలో వున్నాడు. జనమంతా ప్రమాదం జరిగిన ప్రదేశం చుట్టూ చేరారు. “నిజానికి! లారీడ్రైవరు తప్పులేదు! ఇతను విపరీతమైన వేగంతో రాంగ్ సైడు వచ్చాడు!” అంటున్నారెవరో. “చూశారూ? ఇలాంటివన్నీ రోడ్ రూల్సు పాటించకపోవడం వలన సంభవిస్తూవుంటాయ్. నిర్లక్ష్యం! అశ్రద్ధా! జీవితాన్ని ఎలా కబళిస్తుందో చూస్తున్నారా? జనసమర్ధంగల ప్రదేశాలలోనూ! ఎక్కువగా, ఈ ఫుట్ పాత్ లమీద నడవాలి జనం. నడవరు ఎవరికి వారు వారే తప్పుకుంటారులే అన్న

నిర్లక్ష్యధోరణి, హద్దుమీరిన వేగం! వాహనాలు నడిపేటప్పుడు నిషానీయాలు వాడటం మొదలయిన దుర్గుణాలు ఈ ప్రమాదాలకు దారితీస్తాయ్. అందువల్ల ప్రతీదానికీ, జీవితంలో ఓ నియమం నిబంధనా వున్నాయ్. అతిక్రమించి, హద్దుమీరి నడిస్తే ఇలాంటి విషాదాలే జరుగుతుంటాయ్.

ముఖ్యంగా రోడ్డుపై నడిచేటప్పుడూ, పరధ్యానం పనికిరాదు. దృష్టిమార్గంపైనే కేంద్రీకరించాలి. అటువంటిది చేయలేనప్పుడు ప్రమాదాలు సంభవించి ఎదుటివారి జీవితం పతనం చేయడం కాకుండా, నేరం చేసినందుకు వారి జీవితాలూ పతనం అవుతాయ్. అందుకే ట్రాఫిక్ రూల్సును అనుసరించడం పౌరునిగా మనం నేర్చుకోవాలి. చట్టం ఏర్పరిచిందీ, న్యాయం ప్రబోధించేదీ, మనిషి మనుగడ సుఖమయం చేసి సంఘాన్ని మంచిమార్గంలో నడిపించాలనే! అంతేకాని సంఘమే చట్టాన్ని ధిక్కరించి అరాచకాలు, అక్రమాలు చేస్తూవుంటే మనిషికి రక్షణలేకపోగా, అటు చట్టంగానీ, సంఘంగానీ ఉద్ధరించబడటం, అసంభవం. అబ్బాయిలూ, మంచివినడం చేయడం మానవధర్మం వ్యతిరేకించడం రాక్షసప్రవృత్తి! ఇకపదండి! ఇంటికి వెళదాం!" ఆకలిగావుంది. పరంధామయ్యగారు ఇంటివైపు నడకసాగించారు.

పరంధామయ్యగారి ఇంటికి కొంచెం అవతలగా కొంత మంది పేదలు గుడిశెలు వేసుకుని కాపురాలుంటున్నారు. సామాన్యంగా వారంతా పగలు కూలీ, నాలికీవెళ్ళి పొద్దుగుంకే సమయానికి వెనుతిరిగి ఇండ్లకు చేరుకుంటారు. వారం

దరితో పరంధామయ్య చూడలేనిది. ఉదయం పనివేళల్లో వారి ముఖాల్లో కనిపించే ఉత్సాహం, ప్రశాంతతా తిరిగి సాయంకాలం ఇంటికి వచ్చేసరికి ఉండకపోవటమే! దానికి కారణం మరేమిటో కాదు. త్రాగుడు త్రాగి తందనా లాడుతూ, వారిలో వారు, కారుకూతలు కూసుకుంటూ గూడెం వైపు ప్రవేశిస్తారు. అడుపులు, అల్లర్లు, కొట్లాటలు ఒకటేమిటి ఒక జాతర జరుగుతున్నంత సందడిగా వుంటుంది.

ప్రతిరోజులాగానే, ఒకరోజు పరంధామయ్యగారు ఆరుబయట పడకకుర్చీలో కూర్చుని చుట్టకాల్చుకుంటు న్నారు. గోపీ సురేష్‌లు ఇద్దరూ బయటనించి హడావుడిగా పరిగెత్తుతూ ప్రవేశించారు. "నాన్నగారూ! ఆఇళ్ళల్లో దెబ్బ లాటయింది. ఓవ్యక్తిని తలపగులగొట్టి చంపిపారేశారు!" సురేష్ కంగారుగా అన్నాడు. పరంధామయ్యగారిది మామూలే! ఎందుకంటే వారంతా ప్రొద్దుగుంకేసరికి త్రాగి తందనాలాడుతారని ఆయనకు తెలుసు.

"అబ్బాయిలూ! మీరు తెలుసుకోవలసిన విషయా లలో ఈత్రాగుడు చాలాముఖ్యమయింది. ఇలాకూర్చోండి! ఈ త్రాగుడువలన జరిగే నష్టాలు అన్నీ, ఇన్నీ. కావు. ఇది ఎక్కువ శ్రమజీవులను అంటిపెట్టుకునివుంటుంది. పగలంతా శ్రమించిన శ్రామికులు ప్రొద్దుగుంకేసరికి ఆ శ్రమను మరచి సుఖంగా నిదురించాలన్న అభిప్రాయంతో త్రాగటం జరుగుతుంటుంది. నిజానికి శ్రమ అధికంగా చేసేవాడికి,

ఏ మందూ అవసరం లేకుండానే, సుఖమైన నిద్ర కలుగుతుంది. పాపం కండలు కరిగించివచ్చిన ఆదాయం అసాంగాయి పాపుకు కట్టి, మరునాడు గంజితోనే పొట్టనింపుకుని ఆ పూరింటిలోనే జీవితం గడిపేస్తారు వాళ్ళు. నిజానికి ప్రభుత్వం దీనిమీద ఎంత ఆదాయంవున్నా! ప్రజాక్షేమం కోసం దీనిని అరికట్టడం ధర్మం. కానీ అట్లా జరగడం లేకపోగా నానాటికీ ఇది సంఘాన్ని ఆర్థికపరంగానూ, ఆరోగ్యంగానూ, పతనం చేయడమేకాక, అరాచకాలూ, హత్యలకూ, కారణం అయి సంఘాన్నీ, ప్రగతినీ సమాధిచేస్తోంది. ఈనాడు చదువుకున్న వారుకూడా నూటికి 80శాతం దీని అలవాటుకు బానిస లయ్యారు.

మొదట సరదాగా ప్రారంభిస్తారు. తాగిన తరువాత శరీరమంతా మైకంకమ్మి ఆ కాసేపూ ఆనందంగా ఉంటుంది. మెదడు మొద్దుబారి ఏం మాట్లాడుతున్నాడో, ఏం చేస్తున్నాడో తెలియని పరిస్థితికి గురికావడం జరుగుతుంది.

నిజానికి ప్రతిమనిషికీ మంచిమనసూ, ఆయనకు నిండా జాలీ బాధా నిండివుంటాయ్. మనిషి రాక్షసునిగా మారటానికి కారణం వాతావరణం పరిస్థితులే కారణం. జేబులో వున్న నాలుగు రూపాయలూ దీనికి తగలేసి, ఇంటివద్ద భార్యాపిల్లల్ని బాధపెడుతూ, వారిని చదివించలేక, తన జీవితంతోపాటు వారి జీవితాలనూ తగలేస్తారనీ, తాగుబోతులు. వీరికి అప్పులబాధ లెక్కువ. ఆలోచనా జ్ఞానం తక్కువ.

సరదా రానురాను అలవాటుగా మారి తన సంపాదన నాశనం కావడమే కాకుండా, పెద్దలు సంపాదించింది కూడా తగలేసి చివరకు భార్యాపిల్లల్ని దిక్కులేని అనాథలను చేసి సంఘంపై వదలిపెడతారు. ఈనాడు మనం వీధులనిండా చూస్తున్న, అనాథ బాలబాలికలు, అడుక్కుతినేవాళ్ళూ వీళ్ళంతా, మనిషిలోవున్న విలాసాలు తయారుచేసిన అనాథలే! త్రాగుబోతుకు ధనంపోవడమే కాకుండా, ముఖ్యంగా ఎవరూ, మూత్రపిండాలూ, శ్వాసకోశాలూ శిథిలమయి పచ్చని నూరేళ్ళ జీవితం కొద్దికాలానికే పరిసమాప్త మవుతుంది మనిషినుంచి మనిషి ఇలా నశించడం జరుగుతూ వుంటే జాతిక్షీణత తప్పనిసరి. ఏ ప్రభుత్వమయినా ప్రజలు సుఖంగా వుంటేనేగదా!

సరదాకోసం త్రాగి, తన్నులాటలలో ప్రవేశించి, మైకంలో హత్యలూ, మానభంగాలూచేసి జైళ్ళకు వెళుతున్న యువకులు ఎందరోవున్నారీ సంఘంలో! చక్కని రక్షణా, మంచిపెంపకంలో విద్యాధికులయి దేశభవిష్యత్తును తీర్చిదిద్దగల యువకుల జీవితాలను ఈత్రాగుడు చీడపురుగు పట్టి వారిజీవితాలను అరాచకాలవైపు మళ్ళించి, కాలరాస్తోంది. ఈసమస్య ఎవరూ ఆలోచించరు. ఎవరికీ అక్కరలేదు. త్రాగేవారి సంఖ్యతోపాటు, తయారుచేసేవారిస్వార్థం పతాకస్థాయిని చేరుకుని అడ్డమైన కల్తీలూ త్రాగుడులో కలుపుతున్నారు. అడపా, దడపా పేపర్లో చూస్తున్నాం. ఈ సారాయిత్రాగి అక్కడ వందమంది చనిపోయారు ఇక్కడ

కొందుసందలు మరణించారనీ, ఈ విషయం అటు ప్రభుత్వానికీ, యిటు ప్రజలకూ, యెవరికీ అవసరంలేదు. ఆర్థికంగా ఎట్లా బాగుపడుతుంది దేశం? బాగు చెయ్యాలని ప్రతి మనిషీ అంటాడు మార్గం ఆలోచించడు.

సంపాదన తక్కువ. ప్రతి మనిషికీ అవసరాలూ, విలాసాలూ ఎక్కువ. తెల్లవారితే రూపాయలు అవసరం. ఈ అవసరాలు కనిపెట్టి ఎందరో ధనవంతులు ఈ నిరుపేదలకు అంతులేని వడ్డీలు నెత్తిన రుద్ది భాగ్యవంతు లవుతున్నారు. ఏ సమస్యయినా ఒక అక్రమాన్ని ఆధారం చేసుకుంటేనేగాని వ్యాపించలేదు.

"మామయ్యా చూశారుగా? చక్కటి ఉద్యోగం, స్వంత యిల్లు, ప్రశాంతమయిన సంసారం, చెడు సావాసాలకు మరిగి వీటన్నిటికీ దూరమై ఎట్లా బాధపడుతున్నాడో? చేతులు కాలాక ఆకులు పట్టుకుని ప్రయోజనం ఉండదు. అందుకే పెద్దలు చెప్పేది. అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల? అని. చూశారా! సాటి మనిషిలోవున్న అలవాట్లను ఆధారం చేసుకుని సంఘంలో దోపిడీ ఎలా జరుగుతుందో! తనకు సమయానికి డబ్బు యిచ్చిన వాడు దేముడని భావిస్తాడీ అమాయకుడు. అంతేగానీ, తనలోవున్న వ్యాధిని నానాటికీ పెంచి తనకు బానిసను చేసుకుంటున్నాడని గుర్తించనూలేడు. తన అలవాట్లకు స్వస్తి చెప్పనూలేడు. అదే బలహీనత. తన బలహీనతే ఈనాడు [illegible]

రోగాంటున్న సమస్య అని అతడు అర్థంచేసుకోలేడు"
దీర్ఘంగా నిట్టూర్చారు పరంధామయ్య.

"అదేమిటి నాన్నగారూ? ఎవరో త్రాగితే దేశం సమస్య ఎమరోగవడమేమిటి?" సురేష్ అమాయకంగా ప్రశ్నించాడు.

"ఒక ధనికుడికి, మరో వ్యక్తి మీద పగ వుంటుంది. ఈ త్రాగుబోతుకి బాగా త్రాగబోయించి హత్య చేయించి తను తప్పుకుంటాడు. ఓనాటి ఆనందంకోసం జైలుపాలు చేసుకుంటాడు తన జీవితం ఈ త్రాగుబోతు. ఇక నాయకుల గురించి ఆలోచిద్దాం! ప్రభుత్వమంటే బహిరంగమైన వ్యాపారంగా మారిందీరోజు. ప్రజల్లో చాలా మటుకున్న బలహీనతలు మన నాయకులకు తెలుసు! ఓటుకున్న విలువా, దానికున్న హక్కూ, ఈ అమాయకులకు అర్థంకాదు. ప్రతి వాడలోనూ, ఓ నాయకుడ్ని చేరదీసి కొంత ధనమిచ్చి ఆ ఓట్లన్నీ తనకు వేయించమంటాడు. తనమాట వినే ప్రతి వాడికీ, అంతో ఇంతో త్రాగబోయించి, మిగిలిన ధనం దాచుకుని నాయకునికి ఇచ్చిన వాగ్దానం ప్రకారం అదరించీ, బెదిరించీ, ఓట్లు వేయించి గెలిపిస్తాడీ విశ్వాసపాత్రుడు. ఆ నాయకుడు పదవిలోకి వచ్చి చేసే అరాచకాలు అన్నీ, ఇన్నీ కాదు"

ప్రజలంతా తన సేవకులనీ, ప్రభుత్వం తన స్వార్జిత మనీ, ఆయనకాడికి లంచాలు పుచ్చుకుని కోటికి పడగ లెత్తటం ప్రారంభిస్తున్నాడు. ఇదంతా ఎందువల్ల? జరుగు

తోందంటావ్? అవినీతిమూలంగా, అలవాట్ల మూలంగా, బానిసబుద్ధిమూలంగా కాదంటావా? మనదేశానికి స్వాతంత్ర్యం రావటంకోసం, ఎందరో మహాత్ములు ప్రాణాలూ, ఆస్థులూ త్యాగం చేశారు. స్వాతంత్ర్యం వచ్చి ముప్పది రెండు సంవత్సరాలు. ఏమిటి మనం సాధించింది? ఏమీ లేదు. నానాటికీ మనిషికి నిరాశా, విసుగూ, మినహా మరేం లేదు. స్వార్థం, పలుకుబడి పెరిగాయి. ప్రతి అరాచకానికీ వెనుక పలుకుబడి. ప్రజారక్షణ లోపించి భక్షణ ప్రారంభమయింది. ఇదంతా ఎవరితప్పో కాదు. మనది. మనిషిది. ఒక మనిషిలో నిజాయితీ వుంటే అది దేశానికి చెందుతుంది విధులూ, కర్తవ్యం గుర్తుంటే దేశం శుభిక్షమవుతుంది. నీ నెత్తిన మొట్టేవారికి అవకాశమిచ్చి వారి పాదాలదగ్గర పడి గావులు పడవలసిన అమాయకత్వం జాతిలోపడింది.

అందుకే అవకాశం, అర్హతా; మానవత్వం వున్న వారికి ప్రతిఫలం ఆశించకుండా యివ్వు. మంచి జరుగుతుంది. ఓనాటి ఆనందంకోసమో, అవుసరంకోసమో నీ హక్కును నువ్వు మరచిపోతే అది జీవితంమీదా, దేశంమీదకూడా దెబ్బ కొడుతుంది. ఉదాహరణకు మీ పాఠశాలలో ఓ రౌడీ కుర్రవాడు చేసే అఘాయిత్యాలకు ప్రతి విద్యార్థీ భయపడుతూ వూరుకున్నాడనుకో, అది పాఠశాలకే ప్రమాదం. ఎదిరించి అతని తప్పును ఎత్తి చూపించగలవనుకో, అది ఆనాటితోనే సమసిపోతుంది. తప్పుతోవన పడినప్పుడు, తల్లయినా, తండ్రయినా, సంఘమైనా, దేశ

మయినా ఎదిరించవలసిందే! అప్పుడే కనులు తెరిచేది. ఎవరికివారే మనకెందుకనుకుంటే మంచి నశించి, వంచన తలెత్తి బుసకొట్టేది. కాలుపడిన తర్వాత కన్నీరుపెట్టి లాభంలేదురా. కగలగానే అణచివేశామనుకో దాని భయం మనకుండదు. ఇప్పుడు ఒప్పుకుంటావా సురేష్? ఒకదానితో మరొకటి ముడిపడి వుందనీ మంచి ఒక్కటే మనుగడకు రక్షణ అనీ!" వరంధామయ్యగారు నవ్వుతూ ప్రశ్నించారు కుమారుడ్ని. తండ్రీ చెప్పిన విషయాలు శ్రద్ధగా విన్న గోపీ, సురేష్ లిద్దరూ తలలూపుతూ ఒప్పుకున్నారు. వారి చిన్నారి మనసుల్లో దేశంలో జరుగుతున్న అక్రమాలూ, అన్యాయాలూ నీడల్లా కదులుతున్నాయ్!

మరునాడు పాఠశాలలో ఉపాధ్యాయుడు నదుల గురించీ, ప్రాజెక్టుల గురించీ "మీకేం తెలుసురా?" అంటూ ప్రశ్నించగానే గోపీ, సురేష్ లిద్దరూ తమ తండ్రి ద్వారా తెలుసుకున్న విషయాలు చెప్పారు. ఉపాధ్యాయునితోపాటు విద్యార్థులంతా వారివైపు మెచ్చుకోలుగా చూశారు.

"చూశారా? పిల్లల ఎడల శ్రద్ధ తీసుకుని వారికి తెలియని విషయాలు తెలియచెప్పే తల్లిదండ్రులున్నప్పుడు వారిలో భయమూ, భక్తి, శ్రద్ధా, వాటంతట అవే వస్తాయి! ఏదో పాఠశాలకు వెలుతున్నారు గదా అక్కడ ఉపాధ్యాయులే చూస్తారులే! అని నిర్లక్ష్యం చూపిస్తే వారు పాఠశాలలు ఎగగొట్టి అల్లరి చిల్లరగా తిరుగుతూ,

చదువుకు సున్నా చుట్టి! ఎందుకూ పనికిరానివారుగా తయారవుతారు!" అంటూ మిగతా పిల్లలందర్నీ ఉద్దేశించి అన్నాడు ఉపాధ్యాయుడు.

ఈనాడు పిల్లలు పాఠశాలకు వెళుతున్నారో లేదో కూడా తల్లిదండ్రులు పట్టించుకోవడంలేదు. అనాటినుంచీ ఉపాధ్యాయుడికి సర్వస్వతంత్రం వుండేది పిల్లలమీద పిల్లలకు విద్యాభ్యాసం చేయించటంకోసం వారెంతటి కఠిన చర్యలయినా తీసుకునేవారు. దాంతో చదువుమీద శ్రద్ధ, గురువుమీద భక్తి మొదలయినవి కలిగి పిల్లలు క్రమశిక్షణతో పెరిగేవారు. వారి జీవితాలుకూడా ఆనందమయం అయ్యేవి.

అల్లరిచేసే పిల్లవాడ్ని దండించేందుకుకూడా ఈనాడు ఉపాధ్యాయునికి స్వతంత్రంలేదు. గట్టిగా ఓ చెంపదెబ్బ వేస్తే తండ్రి చిటపటలాడుతూ, పాఠశాలలో ప్రవేశించి, విద్యార్థులముందే ఉపాధ్యాయుని అనరాని మాటలూ అంటున్నాడు. అలాంటప్పుడు ఆవిద్యార్థులకు ఉపాధ్యాయుడంటే గౌరవం ఎలా కలుగుతుందీ? చదువెలా అబ్బుతుంది.

పిల్లల్ని ఈనాడు గారాబంచేసి నెత్తికెక్కించుకుంటే అది వారిజీవితానికి గొడ్డలిపెట్టవుతుంది. క్రమశిక్షణా కట్టుబాట్లతో పెంచితే వారి భావిజీవితం సుఖశాంతులతో గడచి వారికీ, వారి ప్రక్కవారికీ కాస్త మంచి జరుగుతుంది. గోపీ సురేష్‌లవంటి శ్రద్ధగా చదువుకోవాలి మంచిని పెంచి, సమతా, మమతలకు నీరుపొయ్యాలి బాలలూ!

3)

# 2. మోసం దాగదు

పూర్వం ఒక వూరిలో రాముడనే వాడుండేవాడు. అతనికి భూదేవి అంటే, అమితమైన గౌరవం. మట్టినయినా కష్టపడి బంగారంలా మార్చవచ్చునని అతడి అభిప్రాయం. సోమరిపోతులవద్ద బంగారమున్నా అతని బద్ధకంవల్ల అది మట్టిపాలు కాకతప్పదు కదా? అదే కష్టించి పనిచేసేవాడికి ముమ్మాటికీ మట్టే బంగారం.

నిజానికి రాముడికి తల్లి, దండ్రులద్వారా సంక్రమించిన ఆస్తి ఏమీలేదు. అయినా, కొంత పొల కవులకి తీసుకుని పగలంతా కష్టపడి పొలం పని చేస్తుండేవాడు. దానితో అతనికష్టం ఫలించసాగింది. మిగతా రైతులందరికంటే ధాన్యం ఎక్కువగా పండించ నారంభించాడు. అసలు పొలంగల కామందుకి తానివ్వవలసింది అక్షరాలా ఇచ్చి మిగిలింది తనవంతు తీసుకుంటూ వుండేవాడు. రామూకి ఆవూరిలో చాలా మంచివాడూ, కష్టజీవి అన్నపేరు సార్థకమయింది. అందరూ అతన్ని గౌరవించి, అడికి ఏం కావాలన్నా సహాయం చేస్తూండేవారు.

కుమారుడి మంచితనానికీ, పలుకుబడికీ తల్లిదండ్రులు కూడా సంతోషిస్తుండేవారు. తమకు ఏబాధాలేకుండా ఆ వృద్ధాప్యంలో గౌరవంగాచూసి పూజిస్తున్నందుకు కుమారునికి ఆయురారోగ్యాలిమ్మని దైవానికి నమస్కరిస్తుండేవారు.

రాముని మంచితనం గురించి విన్న ప్రక్కవూరి కామందు ఒకాయన కొద్దిపాటి కట్నమిచ్చి తన కుమార్తె నిచ్చి వివాహంకూడాచేశాడు. పూర్వంలాగేకాక రామూకి తన కాళ్ళమీద తాను నిలబడగలిగిన స్థోమత ఏర్పడింది. ఒకసంవత్సరం అతని కష్టానికి ప్రతిఫలంగా పంట విరగ పండింది. ధాన్యమంతా ఇంటికి తోలించాడుకానీ, ఎండా, వానలనుంచీ, ఎలుకలూ, పందికొక్కుల నుంచి వాటిని కాపాడాలిగదా! అందుకే అవ్వూరిలో పోలయ్య అనే షావుకారు కట్టించిన గిడ్డంగులు కొన్ని ఖాళీగావున్నాయని తెలిసి, కొంత అద్దె చెల్లించే ఏర్పాటుమీద ఈ రెండువందల బస్తాలధాన్యం గిడ్డంగులకు తోలించాడు.దానికిగాను అతనికి నెల నెలా కొంత అద్దె చెల్లిస్తుండేవాడుకూడా!

పోలయ్యమాత్రం పిసినారి. పైకిమాత్రం చక్కగా తియ్యని కబుర్లు చెపుతూ, క్రొత్తవారికి నిజంగా ఇంత ధర్మాత్ముడువుంటాడా? అన్నంత నమ్రతగా నడుచుకుంటూ వుండేవాడు. కానీ వ్యాపారంలో కల్తీలు అవ్వీకలిపి సగానికి సగం లాభాలు వేసుకుంటూ చాలాధనం గడించాడు.

తానుచేసే పాపాలన్నీ లెక్క వ్రాయవద్దన్నట్లు ప్రతి రోజూ స్నానంచేసి శివాలయంలోకివెళ్ళి ఓ కొబ్బరికాయ కొట్టి వస్తూండేవాడు. దాంతో తన పాపాలన్నీ తుడిచి పెట్టుకు పోయాయనే అతనిభావన. రాముతనవద్ద ధాన్యం దాచేటప్పుడు వాటికి ధర అంతగాలేదు. కానీ ఇప్పుడు ధాన్యానికి సగానికి సగంరేటుపెరిగి మంచిధర పలుకుతోంది;

దాంతో పోలయ్యకు దురాశ ప్రారంభమయింది. ఓనాటి రాత్రికిరాత్రి. రాముని ధాన్యమంతా ఓవ్యాపారికి అమ్మి డబ్బు చేతపుచ్చుకున్నాడు. పాపం ఆ విషయం రామునికి తెలియదు. ధాన్యం అమ్ముకునికూడా పోలయ్య ఒకటి రెండునెలలకు అద్దెకూడా పుచ్చుకున్నాడు.

రాముడు ఓరోజు ఉదయంవచ్చి ఆధాన్యం అమ్మటానికి బేరం పెట్టాననీ తనధాన్యం తనకిమ్మని అడిగాడు. పోలయ్య పెద్దగానవ్వి "ధాన్యమేమిటి? అమ్మటమేమిటి? నావద్ద దాయటమేమిటని?" అడిగాడు. రామయ్యకి పోలయ్య చేసిన మోసం అర్థమయింది. అరిచి నలుగురినీ పోగుచేసి నందువలన లాభం లేదని గ్రహించి, కోర్టులో కేసు పెట్టాడు.

ఓరోజు విచారణ ప్రారంభమయింది. పోలయ్య బోనులో నిలబడ్డాడు. రాముడు న్యాయాధికారికి జరిగిన సంగతంతా విపులంగా వివరించి తన ధాన్యం తనకిప్పించమని వేడుకున్నాడు. అయితే పోలయ్య అసలా ధాన్యం విషయం తనకుతెలియదంటూ న్యాయాధికారి పోలయ్యతో ఆమాటా, ఈమాటా మాట్లాడుతూ మాటల్లోదింపి పాపం" ఖాళీ సంచులన్నా అతనికిచ్చేయట న్యాయం శెట్టిగారూ!" అంటూ నవ్వాడు.

న్యాయాధికారి చాలా మంచివాడు గనుక తనకే అవకాశం ఇస్తున్నాడు. పోనీలే ధాన్యమంతా తనే అమ్ముకున్నాడుగదా! ఖాళీసంచులయినా, రాముడికి ఇద్దామని

పించి "అలాగే! బాబయ్యా ఆ ఖాళీసంచులు వెంటనే ఇప్పిస్తాను!" అంటూ నమస్కారం పెట్టాడు. పాపం పోలయ్య ఖాళీసంచులేకదా! అని కనికరం చూపించాడు కానీ, నేరం అంగీకరించినట్లు తెలుసుకోలేకపోయాడు. న్యాయాధికారి అనుమతిమీద రక్షకభటులు పోలయ్యను బంధించి రెండు సంవత్సరాలు కఠినకారాగారశిక్ష విధించారు. రాముని సొమ్ము మొత్తం పోలయ్యద్వారా ఇప్పించాడు న్యాయాధికారి. చూశారా బాలలూ! మనం ఇతరులను ఎంత తెలివిగా మోసంచేసినా ఎక్కడో ఒకచోట దొరికిపోక తప్పదు. అందుకే ఇతరులను మోసం చేయడం అంత మహాపాపం మరొకటి లేదు.

## 3. ప్రతీకారం

పూర్వం చంద్రగిరి అనే పట్టణంలో, శూరుడు అనే ఒక వీరుడుండేవాడు. అతడు జన్మించింది మహారాజువంశం. అయితే చిన్నప్పుడే, తల్లిదండ్రులు పరరాజులచేత పరాభవింపబడి మరణించటంవలన, ఒక విశ్వాసపాత్రుడయిన సైనికునిద్వారా శూరుడు రక్షింపబడి అతని ఇంటిలోనే పెరిగి పెద్దవాడయ్యాడు.

మహారాజు కుటుంబీకుడయినశూరుని మామూలుగా పెంచడం ఇష్టంలేని ఆ సైనికుడు శూరునికి బాల్యంనుంచీ, చదువు సంధ్యలతోపాటు, యుద్ధవిద్యలూ, సాముగరిడీలూ, అన్నీ నేర్పించాడు. అయితే, శూరునికివిషయాలు ఎప్పుడూ

చెప్పకపోవటంవలన తానొక సామాన్యుడిననే భావిస్తూ వచ్చాడు. విద్యాభ్యాసం అంతా పూర్తయ్యాక తాను రాజాస్థానంలో ఏదయినా, అసాధారణమైన పదవిని సంపాదించాలని కోరిక కలిగింది శూరునికి. తండ్రికూడా అందుకు సమ్మతించి తాను ఇన్నాళ్ళూ, ఏరాజ్యంలోవుంటూ సుఖంగా శత్రుభయంలేక జీవయాత్ర సాగించాడో, ఆ మహారాజునే ఆశ్రయించమని శూరునికి చెప్పిపంపాడు, అప్పటిలో విజయదశమి ఉత్సవాలు జరుగుతున్నాయ్.

ప్రతి సంవత్సరం విజయదశమికి వీరులందరినీ ఆహ్వానించి పోటీలలో విజేతలయిన వీరుల్ని సత్కరించడమే కాకుండా ఆ రాజ్యపురాజయిన ధర్మపాలుడు. ఆవీరులకు తన ఆస్థానంలో మంచి మంచి పదవులిచ్చి పోషించడం అలవాటు.

ధర్మపాలుని సైన్యంలో మచ్చుకైనా పిరికివాడులేరు. దానికి కారణం ఇదీ! ప్రతిసంవత్సరం వీరులకు పోటీలుపెట్టి, విజేతలయిన వారిని మాత్రమే! ప్రధానమైన పదవులలో నియమించడం. ధర్మపాలుని సైన్యం విషయం తెలిసిన ఏ పొరుగురాజూ, అతని రాజ్యంపై దండెత్తాలని ఆలోచించేవాడుకాడు. అందువలననే ఆ రాజ్యానికి శత్రుభయంలేక, యుద్ధములు ఎప్పుడయితేనేవో, అనవసరపు ఖర్చులుండేవి కావు. ప్రజలమీద పన్నులు అధికంగా వసూలు చేయవలసిన అవుసరమూ వుండేదికాదు. అటు మహారాజు ధనాగారంతోపాటు, దేశప్రజలంతా పచ్చగా కళకళలాడుతూ కనిపించేవారు.

అన్ని సంవత్సరాల మాదిరిగానే, ఆసంవత్సరంకూడా విజయదశమి ఉత్సవాలు ఏర్పాటయ్యాయ్. దేశదేశాల నుంచీ, ఎందరో యుద్ధప్రవీణులు వచ్చారు. ఈ ఉత్సవాల్లో శూరుడుకూడా తండ్రి సలహానను సరించి పాల్గొన్నాడు. మరోదేశవీరుడయిన విముఖునికీ, శూరునికీ యుద్ధం ప్రారంభమయి, శూరుడు జయంపొందడం జరిగింది. అయితే అప్పటి వరకూ, ఎందరో మేటి వీరులనందరినీ జయించి ధర్మపాలుని ఆస్థానంలో ప్రధానపదవిని పొందగలనని వాంఛించిన, విముఖునికి శూరుడు తననుఓడించి, తనస్థానంతాను పొందడం కంటకప్రాయమైంది.

మహారాజు శూరుడ్ని తన సకల సైన్యాధ్యక్షునిగా నియమించినట్లు చాటించి, వీరుడయిన విముఖునికి కూడా ఒక సేనాధిపతి పదవిని అంటకట్టాడు. విముఖుడు వీరుడేకాని రాజవంశీయుడు మాత్రంకాదు. మరునాటినుంచీ, శూరుని పేరు వాడవాడలా కీర్తింపబడుతోంది.

విముఖుడు మాత్రం, సమయంచూసి, శూరునికి ఎసరు పెట్టాలనే ప్రయత్నంలో వున్నాడు. అది తెలియని శూరుడు, విముఖునితో మరింత కలుపుగోలుతనంగా వుంటూ, అందరి మెప్పులకూ పాత్రుడౌతున్నాడు. విముఖుడుకూడా పైకి శూరుడు ఒక్కక్షణం కనిపించకపోతే! బ్రతకలేడేమో! నన్నట్లుగా ప్రవర్తిస్తుండేవాడు.

యుద్ధరంగమన్నా, యుద్ధమన్నా ఎక్కువ మోజు కలిగిన శూరుడు. ఒకరోజు విముఖునితో అన్నాడు.

"మిత్రమా! రాచరికం అన్నాక, ఎక్కువగా కాకపోయినా, అప్పుడప్పుడూ యుద్ధాలు జరగాలి. లేకపోతే కత్తులకు తుప్పూ, వీరుల శరీరాలకు సోమరితనం అలవాటయి ఏదో ఒకరోజు అసలుకే ఎసరు వస్తుందిగదా?" అంటూ!

"నీవు చెప్పింది! అక్షరాలా నిజం. ఏ యుద్ధమూ, లేనప్పుడు మనకీ పదవ్రతె దుశ? మనను గుర్తింపుమాత్రం ఏముంటుంది? గనుక!" అన్నాడు విముఖుడు.

"హారుగునున్న! మాళవదేశంపై దండయాత్ర ప్రారంభించాలని వుంది నాకు. మహారాజుతో ఈ విషయం చర్చించాలి. సోమరిపోతుల్లాగా ఇంతమందిని పోషించే బదులు చిన్న, చిన్నరాజ్యాలు జయిస్తూ, విస్తరింప చేయొచ్చు కదా?" అంటూ తన అభిప్రాయం వెలిబుచ్చాడు శూరుడు.

విముఖుడు ఆరాత్రికే అవుసరంగా మహారాజు దర్శనంకోరాడు. అంత హడావిడిగావచ్చిన విముఖుని చూసి మహారాజు కంగారుపడి "విషయ మేమిటి? అంటూ అడిగాడు.

"మహారాజా! మీరు నమ్మినా, నమ్మకపోయినా, నేనిప్పుడు మీకు అతిముఖ్యమైన విషయం చెప్పాలని వచ్చాను. శూరుడు మాళవదేశపు గూఢచారి. నెమ్మదిగా తన ధైర్యం ప్రదర్శించి మీ అభిమానం సంపాదించి, ఉద్యోగంచేపట్టి కోటలో పాగావేసి ఆనుపానులన్నీ తెలుసు

కున్నాడు. అంతేకాదు. రాజ్యవిస్తరణ పేరుతో, రేపో, మాపో, మిమ్మల్ని మాళవదేశంపై దండెత్తమని ప్రోత్సహిస్తాడు! తరవాత ఏం జరిగేది? మీరే ఆలోచించండి!" అంటూ వంగి నమస్కరించాడు. మహారాజు ఆ మాటలు నమ్మలేకపోయినా, అకారణంగా విముఖుడు శూరునిపై ఎందుకు అబద్ధాలు చెప్పకూడదా అని ఆలోచనలో పడ్డాడు.

"ఒకవేళ మీకు సందేహంగా ఉంటే రేపు మీరే పరీక్షించండి! శూరుడు ఈ విషయం మీతోనే అంటాడు. ముందుగా తెలిసింది. మీ ఉప్పు తింటున్నాను గనుక చెప్పటం నా ధర్మం" అంటూ మహారాజు దగ్గరనుంచి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడు సభలో, శూరుడు మహారాజుకు నమస్కరించి ఈవిధంగా అన్నాడు.

"మహాప్రభువులకు మనవి. ఎన్ని సంవత్సరాలిలా యుద్ధంలేకుండా, వీరులందరినీ తమవీరత్వం మరచిపోయేలా చేయడం? మీరు అనుమతిస్తే మాళవదేశాన్ని జయించి మనరాజ్యంలో కలుపుతాను!" అన్నాడు. విముఖుడు మహారాజువంక గర్వంగా చూశాడు. "చూశారా! నేను చెప్పింది అక్షరాలా నిజంకాదా?" అన్నట్లు.

వెంటనే మహారాజు ఆనతిపై శూరుడ్ని బంధించడం చెరసాలలో పెట్టడం, ఆ పదవి విముఖుడికి కట్టబెట్టడంకూడా జరిగిపోయింది. అయితే శూరునికి మాత్రం తన తప్పేమిటో

తెలియలేదు. చెరసాలలో తల పగలగొట్టుకుంటున్నాడు. మంత్రి మణివర్మకు శూరునిపై చాలా విశ్వాసం వుంది. ఒక నాడు చెరసాలలో శూరుని కలిసి హెచ్చరించాడు— పదవీ వ్యామోహంతో అదంతా ఆ విముఖుడు పన్నిన కుట్ర అనీ శూరుని పదవి విముఖుడు నెత్తిన వేసుకున్నాడనీ, ఏనేరాలయితే శూరునిపై మోపాడో, అదే నేరం అతను చేయబోతున్నాడనీ, వివరంగా శూరునితో చెప్పి, మంత్రి అతి చాకచక్యంగా, శూరునిలాంటి మనిషిని మరొకడిని ఖైదులో వుంచి, అసలు విషయాలు సేకరించి మహారాజు కనులు తెరిపించమని శూరుని నియమించాడు మణివర్మ. శూరుడు ఆరాత్రికి రాత్రే తన గుర్రంపై ఖైదునుంచి బయటపడి మాళవ రాజ్యంకేసి పయనం సాగించాడు.

మరునాటి సాయంకాలానికి శూరుడు మాళవరాజ్యపు సరిహద్దులు చేరుకున్నాడు. ఖరీదయిన తన దుస్తులను ఓ పాడుపడిన ఆలయంలో భద్రంచేసి సాధారణమైన దుస్తులతో నగరంలో ప్రవేశించాడు. మహారాజు వేటకోసం బయలు దేరబోతున్నాడు. శూరుడు గబ, గబా వెళ్ళి మహారాజు కాళ్ళపై బడి!

"మహారాజా! మీరు రక్షించానంటే తప్ప! మీ పాదాలు విడువను! అన్నాడు.

"అసలు ఎవరు నువ్వు? ఏం జరిగింది. అంత ప్రాణభయంలో వుంటే మా రక్షణ నీకు తప్పనిసరిగా వుంటుంది! లే!" అన్నాడు.

"మీరు మాటతప్పితే నాతల తెగిపోతుంది ధర్మ పాలప్రభువు!" ఇంకా ఏదో చెప్పబోయాడు. మహారాజు పళ్ళు పటపటకొరికి. "ఆ! నీచుడు నీకు ప్రాణహాని తల పెట్టాడా. అసలేం జరిగింది?" అంటూ కూడిన్ని పైకి లేవ నెత్తాడు. మహారాజు ధర్మపాలుని పేరు వినంగానే మండి పడటంచూసి ధర్మపాలునికి నిశ్చయంగా ఈరాజు శత్రు వేనని నిశ్చయించుకున్నాడు.

"మహారాజా! నేనూ కత్తియుద్ధంలో నేర్పరినే! వెళ్ళి ఆస్థానదళంలో ఉద్యోగం ఇవ్వమన్నాను. ఎవరో కూరుడట. వెంటనే నేను మాళవదేశపు గూఢచారినంటూ సైనికులను నాపైకి వుసిగొలిపాడు. నేను వారిని ఎదిరించి, ప్రాణ భయంతో ఇటు పరుగుపెట్టాను. నిజానికి నాది ఈదేశం కాదు. మాది చోళదేశం. వారు నన్ను బ్రతకనిస్తారన్న ఆశనాకులేదు. వారు నాకోసం చెట్టూ,పుట్టా అన్నీ గాలిస్తూ న్నారు రక్షించండి!" అంటూ మరోసారి ప్రాధేయపడ్డాడు.

"అసలు గూఢచారి అక్కర్లేకుండగా! నిన్నెందుకు అనుమానించాడా సూరుడు. ఎవడా కూరుడు? యుద్ధంలో ముందు నాకత్తికి ఎరయ్యేది ఆకూరుడే! వాడిని గురించి మా విముఖులు నాకు తెలియపరిచింది నిజమేనన్నమాట నీకేం భయంలేదు నారాజ్యంలో నీకు ఏ ఆపదా వుండదు, మేము వేటనించి తిరిగిరాగానే నీకు సైనికోద్యోగం ఇవ్వడంతో పాటు, ధర్మపాలునిమీద యుద్ధం ప్రకటిస్తాం!" అంటూ గర్వంగా మరోసారి నవ్వాడు.

తిరుగుతోంది. మహామంత్రి చెప్పినట్లు విముఖుడు మాళవదేశపు గూఢచారి. ఆనేదో వ్రాసుకోక అన్న మాటలు మహారాజుకు చెప్పి! తను ఆలోచిస్తున్న పన్నాగం తన తలమీద పిద్దావన్నమాట. మహారాజు వేటకు వెళ్ళగానే వాడు పళ్ళు కొరుకుతూ తన గుర్రాన్నెక్కి, మరో దారివెంట త్వరగా నగరం చేరుకుని మంత్రి దర్శనం చేసుకుని జరిగినదంతా చెప్పాడు. మంత్రి వాడ్ని యధాప్రకారం ఖైదులో వుంచాడు.

మరునాడు మంత్రి మణివర్మ మహారాజును దర్శించి చాలా సేపు చర్చించాడు మంత్రి. తరువాత మహారాజు ధర్మపాలుడు విముఖునికి కబురు పంపి

"విముఖా! ఈ రాజ్యంలోని సర్వసైన్యం నీ చేతిలో వుంది. మహామంత్రికి కూడా నీమాటకు ఎదురు చెప్పవద్దని శాసించాను. ఇక ఈరాజ్య పరిరక్షణ భారం నీమీద ఆధారపడి వుంది. ఏంచేసినా ఈ రాజ్యలక్ష్మి నీకు బ్రహ్మరథం పడు తుంది!" అంటూ చెప్పాడు.

"చిత్తం మహారాజా! అయితే నాజైత్రయాత్ర సాగి స్తాన్నా. మీకు చెప్పినట్లు ముందుగా మాళవదేశంపైనే దండెత్తుతాను!" అంటూ అక్కడినించి వెళ్ళిపొయ్యాడు.

సమయం అర్ధరాత్రి అయింది. విముఖునిమందిరంలో ఒక వేగులవాడు నిలబడి విముఖుడు చెప్పింది వింటున్నాడు తరువాత ఓ లేఖ విముఖుడు అను గూఢచారి చేతికిచ్చి

పంపాడు. గూఢచారి చీకట్లో కలిసిపోయాక విముఖుడు గుండెలపై చేయివేసుకుని నిదురించాడు.

తెల్లవారింది. విముఖుడు చాలా సంతోషంగా కనపడుతున్నాడు. తన గుర్రాన్నెక్కి రాజదర్బారులో ప్రవేశించాడు. గుర్రందిగి తన ఆసనంవైపు ఠీవిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి ఆశీనుడయ్యాడు. కొంతసేపటికి మహారాజూ, మహామంత్రీ ప్రవేశించి ఆశీనులయ్యారు.

"సైన్యాధ్యక్షా! మాళవదేశంమీద యుద్ధాన్ని ప్రకటించు!"

మహారాజు శాసించేసరికి విముఖుడు లేచి నిలబడ్డాడు.

"చిత్తం ప్రభూ!" ఎదురుగా ప్రత్యక్షమయిన శూరుణ్ణి చూసి గొంతులో పచ్చివెలక్కాయ పడింది విముఖునికి. తనచుట్టూ విచ్చుకత్తులతో సైనికులు నిలబడి వున్నారు.

"విముఖా! మాళవదేశపు గూఢచారి శూరుడా! నువ్వా! ఇదిగో రాత్రినువ్వు నీ వేగులవాసిద్వారా మాళవ రాజుకు పంపినలేఖ అదిగో నువ్వు కబురంపిన గూఢచారి!" పెడరెక్కలు విరిచి సైనికులు విముఖుని గూఢచారిని పట్టి తెచ్చారు. విముఖునికి వొంటినిండా చెమటలుపట్టాయ్. తల వంచి నిలబడ్డాడు. ఇంతలో అసలు మహారాజుకు తనమీద అనుమానం ఎందుకు కలిగిందో అతనికి అందలేదు.

ధర్మపాలుడు దండయాత్ర చేస్తున్నాడని విన్న మాళవదేశ మహారాజు తన విముఖుడు వున్నాడుగదా

జయంత తన దేనని భావించి ఎక్కువ. నలుగురూ యుద్ధరంగం చేరుకున్నారు. అప్పటికే మాళవదేశ సేనలను చీల్చి చెండాడాడు. శూరుడు మాళవదేశపు రాజుకూ ఓటమి అంగీకరించక తప్పలేదు.

కోట ముట్టడించి, ఆ వర్తమానం ధర్మపాలునికి పంపాడు శూరుడు. అనవసరంగా అపార్థం చేసుకుని చెరసాలపాలు చేసినందుకు ధర్మపాలుడు శూరునికి క్షమాపణలు చెప్పుకుని మాళవదేశాన్ని జయించినందుకు అతడికి ఘనసన్మానం చేశాడు ధర్మపాలుడు. చూశారా బాలలూ! స్వామిభక్తిగలవాడూ, పౌరుషవంతుడూ తనకు ఆపద గలిగిందిగదా అని ముక్కు మూసుకుని కూర్చోడు. సమయం దొరికితే పగవట్టిన తాచల్లే విజృంభించి, తన నిజాయితీ నిరూపించుకొని ఎదుటివారిని చిత్తుచేసి తన స్వామిభక్తినీ, పౌరుషాన్నీ నిరూపించుకుంటాడు.

అంతేకానీ, తనకు కలిగిన ఆపదవల్లనే జీవితం పతనమయిపోయిందని దిగులుపడి చాకలిమూటలాగా ఓ ప్రక్కన పడుండడు. అనుక్షణం క్రొత్త ఆలోచనలతో ఎత్తుకుపై ఎత్తువేసి ప్రతీకారం తీర్చుకోవటంకోసమే ఆలోచిస్తుంది అతని మనసు.

అది అసలయిన పౌరుషవంతుల లక్షణం. ఆపదలో కృంగిపోకూడదు. కలిసిరాని కాలంలో ఓర్పును మించిన నేర్పు మరొకటుండదనుకుసుమా!

# 4. పూజార్హత

పార్వతీపురమనే వూరికి వున్నయ్య ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు. వున్నయ్యది స్వతహాగా క్రూరమైన స్వభావం. పరులకొంపలు తీసి తాను సంపాదించుకు తినాలన్న అభిప్రాయంగల మనిషి. అదీకాక తాను ఆ వూరికి అధికారయ్యాడేమో, రౌడీలను పోషిస్తూ వూరిలో అల్లర్లకు కారణమయ్యాయి.

తనను వూరివారంతా గౌరవించాలి. తనంటే భయపడాలి. ప్రెసిడెంటు అండ చూసుకుని ఈ రౌడీలను వూరిలో ఆయినదానికీ కానిదానికీ తగాదాలూ, దెబ్బలాటలూ ప్రారంభించారు. ఆవూరిలో అంతా శ్రోత్రియులైన బ్రాహ్మణులూ ఇంకా ఇతరకులాలవారూ వున్నారు. ప్రెసిడెంటు వున్నయ్యగారి మనుషులు బ్రాహ్మణులను ఆట పట్టించడం ఏమన్నా అంటే కొట్టడంలాంటివి కూడా ప్రారంభించారు.

ఎవరు ఏం మాట్లాడాలన్నా భయపడటం మొదలు పెట్టారు. పొద్దుగుంకేసరికి త్రాగి వీధులవెంట అల్లర్లు ప్రారంభించారు. కనిపించినస్త్రీలను అల్లరిపెట్టడం ప్రారంభమయింది. చాలామందికి ఈ విషయాలు లోపల బాధగా వున్నా, వారంటే వున్న భయం వలన వారిమాటలకు భజన చెయ్యడం ప్రారంభించారు. వూరిలో అరాచకం ప్రారంభ

మయి భయం చోటు చేసుకొంది. వీరి దుండగాలకు అంతూ అంతం లేకుండా పోసాగింది నానాటికీ.

వూరి ప్రజానీకంలో తమకు ఎదురు చెప్పే వారెవరూ లేరని గ్రహించిన పున్నయ్య అనుచరులు వ్యాపారస్తులను బెదిరించీ, రైతులను పీడించీ ధనం గుంజసాగారు. క్రమ క్రమంగా హత్యలూ, మానభంగాలూ ప్రారంభమయ్యాయ్. ఆ వూరిలో వుండాలంటేనే భయపడిపోతున్నారు ప్రజలు.

ఆ వూరిలోనే ప్రసాద్ అనే ఒక యువకుడు హైస్కూల్లో చదువుతున్నాడు. అతనిది చాలా పేద సంసారమే అయినా నీతిగల కుటుంబం. ప్రసాదు వారి అక్రమాలు అణచి వెయ్యాలని ప్రయత్నం మొదలుపెట్టాడు. తల్లిదండ్రులు వొద్దని ఎంతో వాదించారు.

"ఎవరికి వారే! మనకెందుకులే! అని వూరుకుంటే నీచుల వలకుబడి పెరిగి, అరాచకం, అల్లర్లూ జరగక మరేం జరుగుతాయ్; చెడు తలెత్తినప్పుడే దానిని ఖండించాలి. అది సంఘమంతా వ్యాపించిందంటే మనుషుల్ని పిచ్చిగం తులు వేయిస్తుంది. అందరూ కలిసికట్టుగా వుండి ఆ నీచుల ఆగడాలు సాగకుండా చూడాలి. ఒకవేళ ఆ ప్రయత్నంలో నా ప్రాణాలు పోయినా మీరేం బాధపడకండి. ఒక మనిషి పోయినా వూరు బాగుపడుతుంది. పదమందికి మేలు జరిగే టప్పుడు ఒక్క మనిషి పోయినా ఫరవాలేదు!" అంటూ తల్లి దండ్రులకు నచ్చచెప్పి.

ఆవూరి యువకులనూ, పెద్దవారినీకూడా అందరినీ ఒకమాటపై వుండేందుకు ఏర్పాట్లు చేశాడు. వూళ్ళో

ప్రసాద్ తెస్తున్న విప్లవం సంగతి ప్రెసిడెంటు పున్నయ్య విన్నాడు ప్రసాద్ ఆరోజు పాఠశాలనుంచి తిరిగిరాగానే, అందరినీ ఒకచోట చేర్చి ప్రెసిడెంటుతో మాట్లాడాలని నిర్ణయించుకున్నాడుకూడా!

కానీ, మార్గమధ్యంలోనే ప్రసాదును పున్నయ్య అనుచరులు కత్తిపోట్లకు గురిచేశారన్న వార్త సాయంకాలానికి వూరంతా గుప్పుమంది. ప్రసాదు చనిపోయాడనే సరికి మిగిలినవారంతా ఇళ్ళల్లోదూరి తలుపులు బిడాయించారు. ప్రసాద్ మరణవార్తవిన్న అతని తండ్రి వుగ్రుడయ్యాడు.

ప్రసాద్‌ను చంపేశామన్న సంతోషంతో హాయిగా పీకలవరకూ త్రాగి ఆనందంగా పడుకుని నిద్రపోతున్నారంతా. ప్రసాద్ తండ్రి రంగయ్య కత్తిపట్టుకుని ప్రళయకాలరుద్రుడిలా పున్నయ్య ఇంటిని సమీపించి ఒక్కపోటు పొడిచాడు. పున్నయ్య అరవబోయాడు. ఎడంచేత్తో నోరు మూసి ఇన్నాళ్ళ నించీ వున్న కసినంతా చూపించాడు రంగయ్య.

పున్నయ్య మరణంతో అతని అనుచరులు కుక్కిన

పేనుల్లా అయ్యారు. వూరిలో ప్రశాంత వాతావరణం ఏర్పడింది. జైలుకు నడుస్తున్న రంగయ్య కొడుకు మాటలు జ్ఞాపకం వచ్చాయ్. పోనీలే! తనూ, తన కొడుకు పోయినా, వూరిలో ఇక అరాచకం జరగదు. వూరి ప్రజలంతా ప్రెసిడెంటు చావుకు సంతోషించినా తండ్రీకొడుకులు కష్టాల పాలైనందుకు విచారించారు. అయోగ్యులు పూజింపబడే చోట భయం, మరణం అరాచకం సంభవం. అందుకే బాలలూ, అరాచకాన్ని దుష్టులనునిర్మూలించడంలో జాప్యం పనికిరాదు.

# తీర్థయాత్రలు

ఒకవూరిలో రామయ్యా, సోమయ్యా అనే మోతుబరు లుండేవారు. సంపదలో ఇద్దరికీ ఎవరికీ ఎవరూ తీసిపోరు. రామయ్యది ఒకవిధమయిన మనస్తత్వం. సోమయ్య భార్య బుచ్చమ్మకూ, సోమయ్యకూ కూడా తీర్థయాత్రలు చేయటం వలన మంచి పుణ్యం రావడమే కాకుండా ధన ధాన్యాదులూ ఆయురారోగ్యాలు కలుగుతాయని నమ్మకం.

సోమయ్య భార్య బుచ్చమ్మ రామయ్య భార్య సీతమ్మను కూడా వారితో పాటు తీర్థయాత్రలకు రమ్మనమని ప్రోత్స హిస్తూవుండేది. నిజానికి సీతమ్మకు తీర్థయాత్రలు చేయాలన్న సరదా ఆశక్తీవున్నా భర్తను విసిగించడం కానీ, అది కావాలి ఇది కావాలి అంటూ విసిగించే మనిషి కాకపోవడంతో ఒకటి రెండుసార్లు అడిగిచూసింది. భార్యకు సమాధానంగా, రామయ్య ఒక చిరునవ్వు నవ్వటం మినహా మరే సమాధానమూ చెప్పేవాడు కాడు.

సోమయ్య కూడా అప్పుడప్పుడూ రామయ్యను అడుగుతూ వుండేవాడు. "ఏమయ్యా? పోనీ బీదవాడివా? అంటే అదీ కాదు. మరెందుకు నేమిన్ని తీర్థయాత్రలు చేసి

వస్తున్నా, వ్రులగా పలకుక్కుండా కూచుంటావు తప్ప సరదా సంతోషంసంగతి ఆలోచించవేం? తీర్థయాత్రలవల్ల పుణ్యం పురుషార్థం రెండూ దక్కుతాయిగదా?" అంటూ!

"ఆఁ! ఎందుకులే సోమయ్యా! ఏదో భగవంతు డిచ్చింది తిని కృష్ణా! రామా! అంటూ ఇంట్లో కూర్చుంటే పోలా! మనసారా దైవాన్ని ప్రార్థిస్తేచాలదూ? హాయిరానా పడి అటూ, ఇటూ పరిగెత్తడం వృథాఅని నాఅభిప్రాయం" అనేవాడు.

రామయ్యకూ, సోమయ్యకూ అసలు భేదమేమిటంటే రామయ్య ఎవరు ఏకాలంలో ఆకలిఅన్నా, విని వూరుకునే వాడుకాడు. అకాల లోకూడా అన్నంవండించి పెడుతూ వుండేవాడు. భాగవతులూ, హరిదాసులూ వస్తే వారికి నూతనవస్త్రాలు ఇచ్చి భోజనతాంబూలాలిచ్చి వారిని సత్క రించి వారి ఆశీర్వాదాలు పొందుతూవుండేవాడు. అతని భార్య సీతమ్మకూడా విసుగు అనేది తెలియక భర్త ఆజ్ఞాను సారం, ఎవరికైనాసరే వండిపెడుతూ, చల్లనితల్లి అన్న బిరుదును పొందింది. అతని ధర్మబుద్ధికి తగినట్లే! నానాటికీ రామయ్యసంపద మూడుపూవులూ ఆరుకాయలు కాసాగింది

ఎవరైనా అవసరానికి అప్పు అడిగితే అది ఎంత మొత్తమయినా చిల్లిగవ్వ వడ్డీలేకుండా ఇచ్చేవాడు దాంతో వారికి రామయ్య దైవంలా కనుపించేవాడు.

సోమయ్య పైకి రావడానికి కారణం వడ్డీవ్యాపారమే! ఇచ్చిన అప్పుకు వడ్డీతో సహా గోళ్ళు వూడగొట్టి వసూలు చేసేవాడు.

"ఎందుకు రామయ్యా? ఈ ఆదర్శాలు? అయిన అందరికీ ఇవాళ దానధర్మాలు చేస్తుంటే రేపు మనకు లేని నాడు ఎవరిస్తాడయ్యా?" అంటూ ఎద్దేవ చేసేవాడు.

"ఎవడు పుట్టించాడో వాడే ఇస్తాడు! వారి అవసరాన్ని ఆధారంగా చేసుకుని వారిదగ్గర అధికమైన వడ్డీలు గుంజితే అది మనకు క్షేమంకాదు సోమయ్యా! తిన్నా వంటపట్టాలి కదా? అనేవాడు రామయ్య రామయ్య ధర్మబుద్ధితో, ఎంతటి రౌడీలుకూడా ఆయనకనిపిస్తే అతని మంచితనానికి తల వంచేవారు. సోమయ్యకు వడ్డీలు పోగవటంతో పాటు మంచిపేరు తరిగిపోసాగింది

క్రమక్రమంగా వూరిలో సోమయ్యకు శత్రువులు అధికమయ్యారు. అతని వడ్డీవ్యాపారం పడిపోయింది. దానికి

తగినట్లు చూసిన యాత్రలకు బయలుదేరమని పోరుతుండేది అతని భార్య. క్రమక్రమంగా మనిషిలో చికాకు తలెత్తింది వారితో వీరితో పోట్లాటలూ కేసులూ ప్రారంభ మయ్యాయ్. ఆ కేసులగొడవల్లో పోలీసులకు లంచాలు. వచ్చినవారందరికీ విందులూ, వినోదాలూ మొత్తంమీద ఆస్తి హారతికర్పూరంలా హరించడం ప్రారంభమయింది.

రామయ్య ప్రతిరోజూ భజనలూ, సత్కథా కాల క్షేపాలూ, దానధర్మాలూచేస్తూ హాయిగా మనశ్శాంతిగా జీవిస్తున్నాడు. సంవత్సరానికొకసారి నవరాత్రులు జరిపి దేవీపూజలు చేయిస్తూ, కొన్ని వేలమంది బీదలకు అన్న దానం చేసేవాడు. తాను ఇన్ని తీర్థయాత్రలు చేసి ఏదో పుణ్యం మూటకట్టుకున్నా మనుకున్న సోమయ్య కుటుంబం చీకాకుల పాలయింది. రోజురోజుకూ, సంఘంలో దైవంలా పూజింపబడుతూ, ధనధాన్యాలతో తులతూగే రామయ్యను చూసి అర్థమయింది సోమయ్యకు. సత్యవ్రతమును మించిన తపస్సు, ధర్మగుణమును మించిన తీర్థప్రయోజనమూ వుండదని.

ఆనాటినుంచీ రామయ్యనే నిజమైన స్నేహితునిగా

ఆరాధిస్తూ, అతని అడుగుజాడలలో నడుస్తూ, అరాచక సంపాదన అల్లర్లనూ మాని త్వరలోనే సోమయ్య కూడా మారిపోయి మంచివాడయ్యాడనిపించుకొని హాయిగా జీవించ సాగాడు.

బాలలూ! కొండెములు చెప్పుట, కొట్లాటలకు తయారు కావటం కంటే పాపమూ, లోభగుణమును మించిన చెడు గుణమూ, మంచి మనస్సును మించిన తీర్థమూ, విద్యకంటే అధికమయిన ధనమూ, కీర్తికి మించిన అలంకారములు వుండవు సుమా! మనిషి మనిషికి సహాయం చేయాలి. ఆపదలో ఆదుకోవాలి. దైవం మనకు సకల సంపదలూ కలిగించేది పొరుగువాడి సుఖం కూడా ఆలోచించమని. అంతేకాని, ఎవడు తింటే మనకేం తినకపోతే మనకేమనుకుని మనస్వార్థం మనం చూసుకుంటూ, అక్రమ సంపాదనలతో లక్షలూ, కోట్లూ గడించినా, రేపు చావు చివరకు మన వెంటరాగల సంపాదనలూ, సంపదలూ, ఏమీ వుండవు.

దయా, దానం, ధర్మ్య, సత్యం, అవే మనిషిని మృత్యుముఖానికి సంతోషంగా పంపగలిగేది. మంచిపనులు చేసే మనిషికిగల సంతోషం, గుండె నిబ్బరం, చెడుపనులు చేసే క్రూరులకు ఉండవుగదా? కనిపించని దైవంకోసం.

కలలుగంటూ పూహాహూ తిరిగేవరకూ, బదులు, నీలాంటి మనిషి జానెడు కడుపు నింపుకోవటంకోసం పడే అగచాట్లను కనిపెట్టి నలుగురికీ సహాకరించండి. వారి ఆశీస్సులే మీాకు కోటి సంపదలు. ఈనాటికీ మనం మహాత్ములుగా పూజిస్తున్న వారంతా మనిషికోసం త్యాగాలు చేసినవారే! మరచిపోకండి మనిషే దైవం.

## సోమరి

ఒక వూరిలో ఒక పేదకుటుంబంలో రాజు అనేకుర్రవాడుండేవాడు. అతడు బహుసోమరి. తల్లిదండ్రులు పడుతున్న అవస్థ గ్రహించక సాటిపిల్లలంతా చక్కగా, పాఠశాలకువెళ్ళి చదువుకుంటూ ఉండేవారు. ఏచెరువు గట్లపైనో, గుడి అరుగులమీాదోకూర్చుని కునికిపాట్లుపడటమో లేక గోలీకాయలాడటమో, బిళ్ళంగోడు ఆడటమోచేస్తుండేవాడు.

తల్లి, దండ్రులకు ఇతడిని ఎలా మార్గంలో పెట్టాడో అర్థంకాలేదు. పోనీ, పనీ పాటలూ నేర్పాలని ప్రయత్నించాడు తండ్రి! ఏపని చెప్పినా! "అమ్మో! నేను చెయ్యాను

నాకు చెయ్యను, నాకు చేతకాదు. పోరపాట్లు జరుగుతా యంటూ తప్పించుకొని చెలాయిస్తూ తిరుగుతూ వేళకు ఎలా వస్తుందో అన్నం అన్న ఆలోచన లేకుండా, వూరు వెంటతిరుగుతూ, "ఆకలి! అన్నం పెట్టమనడం" అల్లరిచేసి గిన్నెలు పగలగొట్టడం! తల్లి కష్టసుఖాలు చెపితే వినిపించు కోకుండా, తల్లిని దెబ్బలు కొట్టడం, తండ్రిని చీదరించుకుని అసహ్యంగా మాట్లాడుతూ, "తిండి పెట్టలేనివాడివి పిల్లల్ని ఎందుకు కనాలంటూ!" నోటికొచ్చిన కారుకూతలు ప్రారం భించాడు.

ఇతని ప్రవర్తన పూరిలో వారందరికీగూడా, అస భ్యంగానూ, అసహ్యంగానూ కనిపించేది. అయినా, తల్లి దండ్రులే పట్టించుకోనప్పుడు మనకెందుకు? లేనిపోయిన సంత అని సరిపెట్టుకునేవారు. అయితే వారికి రాజులో కనిపించిన విశేషమేమంటే ఒక్క పూచికపుల్లయినా ఎత్తి ఇక్కడిది అక్కడ పెట్టకపోవడం. అందరూ అతడ్ని "ఒరేయ్! సోమరి సోమూ" అంటుండేవారు. రాజును వారలా పిలు స్తుంటే చాలా సంతోషంగా ఉండేది. పైగా అదేదో బిరు దనుకునేవాడు.

అందరినీ ఎదిరించడం, వారితో తన్నులు తినటం,

తాను కొట్టడంలాంటి మొండిపనులు ప్రారంభమయ్యాయ్. కొడుకు దెబ్బలు తిని ఇంటికివస్తే, తల్లిదండ్రులు ఎంతో బాధపడి అతని జీవితం ఎల్లాగడుస్తుందా అన్న ఆలోచనతో మనోవ్యాధికి గురికావటం ప్రారంభించారు.

ఒకరోజు ఆ వూరికి ఓ సాధువు వచ్చాడు. అతడు చాలా మహిమలుగలవాడని అందరూ చెప్పుకోనారంభించారు.

అదివిన్న రాజు తండ్రి వెళ్ళి ఆ సాధువును కలుసుకుని నమస్కరించి తన కుమారుడు ప్రయోజకుడయ్యే మార్గమేదయినా చెప్పి పున్నెం కట్టుకోమన్నాడు. ఓ రెండు రోజులు రాజును తనవద్దకుపంపమన్నాడు సాధువు సాధువు చెప్పినప్రకారం రాజు ఆయనవద్దకు పంపబడ్డాడు. మొత్తం మీద సాధువు గొప్పతనమో! అతని తేజస్సోకాని, బుద్ధిగా ఆయనవద్ద కూర్చోవడం ప్రారంభించాడు.

వేళయేసరికి కడుపులో ఆకలిగోల చేస్తుంటే ఆయనకు ఏ సంగతీ చెప్పలేక, ఓ ప్రక్క ఆకలిబాధ భరించలేక సతమతమవుతూ గడపసాగాడు అది గ్రహించిన సాధువు.

"ఏం రాజూ! ఆకలిగా వుందా?" అని అడిగాడు.

"అవును!" అన్నట్లు తలవూపాడు రాజు! "ఈ ఆకలి! నీ లాంటివారికి అందరికీ వుంటుందా? నీ ఒక్కడికే ఉందా?" అని అడిగాడు సాధువు.

"సరేలే! నువ్వేదో తెలివిగలవాడవనుకున్నాను! నా కంటే అమాయకుడివా? తండ్రీ!" అన్నట్లు ముఖంపెట్టి.

"అదేమిటండీ? ఆకలి అన్ని జీవరాసులకూ ఉంటుందిగదా?" అన్నాడు రాజు.

"మరి తిండికోసం! ప్రతిజీవీ! ప్రయత్నిస్తున్నాడంటు న్నావు? అంతేనా! కాలు కదపకుండా ఎవరికయినా కంచములో తిండి వస్తుందా? మరో ప్రశ్న వేశాడు సాధువు.

"లేదు!" ఆలోచనలో పడ్డాడు రాజు.

"మరి నువ్వు ప్రయత్నమే లేకుండా! వేళకు వెళ్ళి తిండి పెట్టమని అల్లరి చేయుటం న్యాయమా? ఏపనిచెప్పినా పొరపాట్లు వస్తాయని తప్పించుకోవడం ధర్మమా! నువ్వో పని చెయ్! ఈరోజునుంచీ నీవు తిండి మానెయ్! తింటే అజీర్తి చేస్తుంది!" అన్నాడు.

"తినకపోతే బ్రతికేదెట్లా?" అడిగాడు రాజు.

"సోమరిలా కూచుంటే తినేదెట్లా?" వెంటనే సాధు

ప్రశ్నించాడు! రాజుకు జ్ఞానోదయమయింది. సాధుః కాళ్ళుపట్టి నమస్కరించి ఆనాటినుంచీ, గాయ, కష్టం చే సంపాదించి తల్లిదండ్రుల్ని పోషించడం ప్రారంభించాడు.

బాలలూ! తింటే అజీర్తి చేస్తుందని తిండి మానవద్దు. పొరపాట్లు రాగలవన్న సందేహంమాని మన ప్రయత్నా మనంచేయాలి.

